శ్రీమతే రామానుజాయనమః

శ్రీమద్వైదికమార్గప్రవర్తకాచార్యోభయవేదాన్త
ప్రతిష్ఠాపకులయిన

తిరువరంగత్తముదనారుచే ప్రకాశింపంబడిన

# ప్రపన్నగాయత్రికి - ప్రతిపదటీక

ఆరంభంబున

కాట్రంబాక - ఉరగం - ఆసూరి - రాఘవాచార్యులవారి
కొమారుఁడు-ఆదికేశవాచార్యులవారిచే నవీనంబుగా
రచింపంబడి సదరు

కా - ఉ - ఆ - ఆదికేశవాచార్యులవారి
స్వకీయ్య వివేకకళానిధి ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

రక్తాక్షినామసం॥ ఆవణి నెల.

దీనిక్రయము - రూ. ౧ - ౪ - ౦.

౧౮౬౭ సం॥ ౨౫ ఆక్టు ప్రకారము రిజిస్టరు చేయఁబడినది.

శ్రీమతే రామానుజాయ నమః.

---

ఇందువలన నఖిలభాగవతోత్తములకుఁ దెలియఁజే యునది యేమనిన(ప్రస్తుతములో గురుపరంపరాప్రభావము - యతీంద్రప్రవణప్రభావము - తెనుగక్షరములతోను - అరవక్షరములతోను - ప్రత్యేకముగా ముద్రింపఁబడుచున్నది కావున - కావలయువారు చందాపుస్తకమునఁ జేవ్రాలుచేసి నెల ౧-టికి అరరూపాయివంతున ధరావత్తు - ఇచ్చువారికి నెలనెలకు సంచికనుబంపుచున్నాడను చందాచేయనివారికి - చందాదారులకయిన క్రయమునకంటె - అంతనధికముగా విక్రయించుచున్నాడను - ఈచందానపేక్షించినవారు చెన్నపట్టణంబున పచ్చప్పయిస్కూలు సంస్కృతాంధ్రభాగము రెండవతరగతి మేష్టరైన - కాట్రంబాక - ఉరగం - ఆసూరి - ఆదికేశవాచార్యులగు నా పేర వ్రాయవలసినది.

కా - ఉ - ఆ - ఆదికేశవాచార్యులు.

శ్రీమతే రామానుజాయనమః.

## పీఠిక.

శ్రియఃపతియు శ్రీవైకుంఠనాథుఁడైన సర్వేశ్వరుఁడు చేతనోజ్జీవనంబునకై వేదంబులుసృజించె నందుఁ జతుర్వేదంబులు వ్యాసమహామునివలనం బ్రసిద్ధంబయ్యె ద్రవిడవేదంబులు నాలుగు - పరాంకుశమునీంద్రునిచే జగద్విదితంబయ్యె నీవేదంబులకు ముఖ్యప్రాణంబు గాయత్రియొప్పు వేదంబు లభ్యసించి యిహపరసుఖంబు లనుభవింపవలయును - ఇట్టి వేదంబులు చదువనెల్లరకు దుర్లభంబగుటచే వేదమాతృకయైన గాయత్రిని త్రిసంధ్యలందు జపించి తత్సుఖంబులందవలయు - చతుర్వింశద్వర్ణాత్మకంబైన గాయత్రి తాను త్రైవర్ణికులకుండప్పఁ దక్కిన స్త్రీశూద్రాదులకుఁ దనవలననే ఫలంబు లేకుండుటఁ జూచి తాను ద్రవిడవేదంబున నందాదియనియుఁ బ్రపన్నగాయత్రియనియు - శ్రీరంగామృతమౌని వాక్సంభవంబై సదా విశ్వజనసేవ్యంబై ప్రవర్తిల్లె - ఈవృత్తాంతంబు భగవచ్ఛాస్త్రంబైన పాంచరాత్రంబున శేషోపాఖ్యానంబున విశదంబై యుండు - ఇట్టి ప్రపన్నగాయత్రికి సర్థంబెఱింగి సుకరంబుగా సేవించుటకుఁ గొందఱు పరమభాగవతోత్తములు నన్ను బలుమాఱు దీనికిఁ బ్రతిపదార్థంబాంధ్రంబున నేర్పరచుమని వేడికొనిన నేనివ్విధంబునఁ బ్రతిపదటీక నొనర్చి మదీయ వివేకకళానిధి ముద్రాక్షరశాలయందు ముద్రించితిని గాన అఖిలభాగవతోత్తములు దీని సభక్తియుక్తులయి సేవింతురని మిగుల బ్రార్థింపుచున్నాఁడను.

ఇట్లు నిఖిలద్రవిడవేదంబులకు భాష్యంబును ద్రవిడవేదసంహితులకును ద్రావిడశాస్త్రంబులకు వ్యాఖ్యానంబును ముద్రించుచున్నాఁడను - ఈద్రావిడవేదంబులు కావలసినవారు చెన్నపట్టణంబున పచ్చప్పయిస్కూలు సంస్కృతాంధ్రభాగము రెండవతరగతి మేష్టరు కాత్రింబాక - కేశవాచార్యులపేరనైనను సదరుపట్టణంబున గోవిందప్పనాయనివీథిలో ఉత్ర

డోర్ నెంబరు ౬౨ గల గృహంబైన మది న్యావివేకకళానిధి ను. శా. నా. రత్నాలయంబైనను - రా - రా - శ్రీ - పు వ్వాడ - చిన్న వెంకటరంగశెట్టి వారి తావునందైనను - రా - రా - శ్రీ - పరమ భాగవతో త్తములగు గంపాడి-శేషా చలశెట్టివారి తావుననైనను నుండుగావునఁ దెప్పించుకొనవచ్చును.

సర్వప్రపన్నజన విధేయుఁడు,

కాట్రంబాక - ఉరగం - ఆసూరి - ఆదికేశవాచార్యులు.

---

కం ॥ శ్రీమద్వ్యాతపురాధీ । శామానవకల్పభూజ సరససమాజా । సోమర వితేజనిఖిలధ । రామండలవహనరాజ రామావరజా॥

కం ॥ వరపంచచరమతత్త్వా । ర్థరహస్యంబులనుదాసతతికొసఁగిమహా । దృతి తములనణచిప్రోచెడు । పరవస్తుశఠారిగురుని బ్రణుతింతుమదిన్॥

ఉ ॥ శ్రీకరభోగభాగ్యముల చేతగృహంబు చెలంగుచుండన । స్తోకకృపావిశే షముల క్షోణిజనాళులఁబ్రోచుచుండుధ । ర్మాకరుసంతతాశ్రితమహా త్మసరోజదివాకరుణ్ శుభ । శ్రీకరు చిన్న వేంకట నృశింహ్మునినేలుఫ ణీశుఁడెప్పుడున్॥

తే ॥ భారతముచేయునపుడు శ్రీ వ్యాసమునికి । విష్ణుమూర్తిసహాయుడై వెలసి నట్లు । ద్రవిడవేదార్థములవిశదముగఁజేయఁ । దలఁచునాదుసహాయుఁడై నిలచియొప్పెఁ । చిన్నవేంకటనరశింహ్మశ్రేష్ఠవరుఁడు॥

సీ ॥ శ్రీమించువెన్నారఁ జెలఁగెడువేంబగోపాలునికృపచేతఁ బరిఢవిల్లి । భోగభాగ్యంబులఁ బొలుపొందుపువ్వాడ వేంకటనరసుభూవిభునిగర్భ । కలశాబ్ధి బొడమి వేంకటరంగచంద్రుఁడు కువలయానందుఁడైకూర్మితోడ । శ్రితచకోరకములఁ జెన్నొందఁబ్రోచుచు వేదశాస్త్రంబులవేత్తఁగాంచి ద్రవిడవేదంబు శేవింపఁదలఁచిపరమ । గురుని వేంకటనరశింహ్మకరుణఁబడసి సన్నుగనియాప్తజనములుసన్నుతింప । పల్లైనరసవచోర్థములఁబ్రాఫిమెరసు॥

సీ॥ శ్రీహారితసగోత్ర శ్రీరాఘవాచార్య పుత్రకశేశవఘనాసురేంద్ర। ఉభ
యవేదాంతార్థ విభవరాశి ద్రావిడాగమంబునకు గాయత్రియొప్పి। అప
నిలోపలసగాయత్ర్యాఖ్యపరంమంత్రమనుగతిశ్రుతికిగాయత్రి కావెంచా
జిమంత్రంబట్లుద్రావిడవేదగాయత్రికివివరణమాంధ్రమందు ప్రతిపదా-
ర్థమొనర్చియిటాకృతినొసంగు। మనిసనీవేదమునుకు గాయత్రియొప్పు
చుండునండాదియనియు నీయుర్విలోప్ర। పన్నగాయిత్రియనియును
బ్రాఢిమీర.

గీ॥ ఈప్రపన్నగాయత్రికిసేనొనర్చి। తినితెనుంగునబదటీక నొనరనిట్లు। ద్ర
విడనిగమాళికొనరింతుధరణిజనము। లిహపరంబులసుఖియింపనింపుతోడ॥



శ్రీమతే రామానుజాయ నమః.

జీయర్ తిరువటిక ళేశరణం.

రామానుశనూత్తంతాతి ప్రతిపధము.

---

౧. శ్రీశైలేశ దయాపాత్రం। ధీభక్త్యాదిగుణార్ణవమ్। యతీన్ద్ర ప్రవణం వన్దే। రమ్యజామాతరంమునిమ్॥

శ్రీజియ్యర్ తిరువడిక ళేశరణం.

౨. లక్ష్మీనాథసమారమ్భాం। నాథయామునమధ్యమామ్। అస్మదాచార్యపర్యన్తాం। వన్దేగురుపరమ్పరామ్॥

శ్రీయఙ్గపతీత్యాద్య స్మత్సర్వగురుభ్యోనమః.

౩. యోనిత్యమచ్యుత పదామ్బుజయుగ్మరుక్మ। వ్యామోహిత స్తదితరాణితృణాయమేనే। అస్మద్గురోర్భగవతోస్య దయైకసిన్ధోః। రామానుజస్య చరణౌశరణంప్రపద్యే॥ శ్రీమద్రామానుజ చరణౌ శరణం ప్రపద్యే॥

శ్రీమతేరామానుజాయనమః.

౪. మాతాపితాయువతయ స్తనయావిభూతిః। స్సర్వంయదేవనియమేనమదన్వయానామ్। ఆద్యస్యనఃకులపతేర్వకుళాభిరామం। శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామిమూర్ధ్నా॥ ౪॥

ప్రపన్నగాయత్రీ.

శ్లో. భూతంసరశ్చ మహదాహ్వయభట్టనాథ । శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ । భక్తాంఘ్రిరేణుపరకాలయతీన్ద్రమిశ్రాన్ శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మినిత్యమ్॥

శ్రీమన్నాథాది ఆళ్వారాచార్యవరుల
తిరువడికళేశరణం.
అళ్వార్ తిరువడికళేశరణం.

ఇరామానుశనూత్తంతాతియాకియ ప్రపన్నగాయత్రి
తిరువరంగత్తమదనార్ అరుళిచ్చెయిత వేదగాయత్రీ
సారమాకియ ఇరామానుశనూత్తంతాతి.



శ్రీమతేరామానుజాయనమః
తనియన్.

శ్రీరంగేమీనహస్తేచ । జాతంరంగార్యనందనమ్ । రామానుజపదాశ్రిత్యం । రంగనాథగురుంభజే ॥ మీనేహస్తాసముద్భూతం । శ్రీరంగామృతమాశ్రయే । కవిం ప్రపన్నగాయత్ర్యాః । రామానుజపదసంశ్రయం ॥

నేరిశై వెణ్పా.

మునైన్ఱవినైయకల మూంకిల్కుడియముదన్
పొన్నంకళల్ కమల ప్పోతిరంటుం - ఎన్నుడైయ
శెన్నికణియాకచ్చేర్ త్తినేన్ తెన్పులత్తార్
క్కెన్నుక్కడవుడైయేన్ యాన్॥

కట్టళైక్కలిత్తుఱై.

నయన్తరుపేరిన్పమెల్లాం పళుతెన్ఱునణ్ణినంపాల్
శయన్తరు క్కీర్త్తియిరామానుశమునితాళిణైమేల్
ఉయర్న్తగుణత్తుత్తిరువరంక త్తముదోంకుమన్పాల్
ఇయంపుకలిత్తుఱైయన్తాతి యోతవిశైనెంచమే॥

శొల్లు న్మైకొంటునతటిప్పోతున్కు త్తొంటు శెయ్యుం
నల్లంపతే త్తుమున్నామెల్లా మెన్ననావినుళ్లే
అల్లుంపకలు మనురుంపటినల్లఱుశమయం
వెల్లుంపరమ విరామానుశవి తెన్నిణ్ణప్పమే॥

పీఠిక.

మొదటిపాశురమందు తమతిరువుళ్లమునుగూర్చి రామానుజుని తిరువటి త్తామరలనుమనమాశ్రయించి యుజ్జీవించునట్లు వానితిరునామములను జెప్పుదమనిరమ్మనుచున్నారు.

కట్టళైక్కలిత్తుఱై.

---

౧-టి పాశురము.

ముా॥ పూమన్నుమాతుపొరున్దియమార్పన్పుకళ్మలిన్త
పామన్నుమాఱనటిపణిన్దుయ్ న్దవన్పల్కలైయోర్
తామన్నవన్ద విరామానుశన్శరణారవిన్దం
నామన్నివాళ్ర నెంచేశొల్లువోమవనామంకళే॥

టీక॥ పూ - పుష్పమందు - మన్ను - నిత్యవాసము చేయు - మాతు - తాయారు - పొరున్దియ - పొందిన - మార్పన్ - పక్షముగల సర్వేశ్వరుని యొక్క - పుకళ్ - కల్యాణగుణముల చేత - మలిన్త - సమృద్ధమైన - పా - ఛందోరూపమైన ద్రవిడవేదములు - మన్ను - నిత్యవాసము చేయు - మాఱన్ - శఠగోపుని యొక్క - అటి - తిరువటికళను - పణిన్దు - ఆశ్రయించి - ఉయ్ న్దవన్ - ఉజ్జీవించినవాడును - పల్ కలైయోర్ తాం - పల్ - అనేకములయిన - కలైయోర్ - శాస్త్రములనుజదివినవారు - తామన్న - తాము ప్రతిష్ఠితులవునట్లు - వన్త - పరమపదమునుండి వేంచేసిన - ఇరామానుశన్ - ఈ యెంబెరుమానారుయొక్క - శరణారవిందం - శరణా - తిరువటికళను - అరవిన్దం - తామరలను - నాం - మనము - మన్ని - పొంది - వాళ్ర - ఉజ్జీవించునట్లు - నెంచే - ఓమనసా - అవన్నామంకళే - అవన్ - వానియొక్క - నామంకళే - తిరునామములనే - చొల్లువోం - చెప్పుదము.

రెండవపాశురంబున నాచిత్తము రామానుజుని శీలగుణంబులనుగాని మ
ఱియొకటిని దలంపదు అది నాకుశిద్ధించినందుకొక హేతువెఱుఁగనను
చున్నారు.

---

౩-వ-పాశురము.

మూ॥ కళ్లార్పొళిత్తిరు త్తెన్నరంగన్ కమలప్పతంకళ్ నెంశిర్
కొళ్లామనిశరై నీంకికుఱై యిల్ ప్పిరానటిక్కీళ్
విళ్లాతవన్పనిరామానుశన్మిక్క శీలమల్లాల్
పుళ్లాతెన్నెంశోన్నట్టీనే నెనకుఱ్ఱపేరియల్వే॥

టీక॥ కళ్లార్పొళిత్తిరు త్తెన్నరంగన్ - కళ్ - పుష్పతేనెలచేత - అర్ - పూర్ణములైన - పోళిర్ - తోపులుగల - తెన్ - దర్శనియ్యమైన - అరంగన్ - రంగస్థలమునకు నిర్వాహకుడయిన రంగనియొక్క - కమలప్పతంకళ్ - కమల-తామరసపుష్పములవంటి - పతంకళ్ - తిరువటికళను - నెంశిర్కొళ్లా మనిశరైనీంకి - నెంశిర్ - మనంబున - కొళ్లా - ఉంచని - మనిశరై-మనుష్యులను - నీంకి - త్రోసి - కుఱైయిల్ ప్పిరానటిక్కీళ్ - కుఱై - తిరుక్కుఱైయలూరు - యిల్ - అవతారస్థలముగాఁగల - పిరాన్ - ఉపకారకులగు తిరుమంగైమన్ననుయొక్క - అటిక్కీళ్ - తిరువటికళయందు - విళ్లాతవన్పన్ విళ్లాత - విడువని - అన్పన్ - భక్తిగల - ఇరామానుశన్ - ఈరామానుజుని యొక్క - మిక్క శీలమల్లాల్ - మిక్క - అధికమైన - శీలం - మంచిగుణములు - అల్లాల్ - కాక - ఎన్నెంచు - నామనసము - ఉళ్లాతు - చింతింపదు - ఎనక్కు - నాకు - ఉఱ్ఱ - పొందుటకు - పేరియల్వు - పేర్ - పెద్ద - ఇయల్వు - ఉపాయము - ఒన్ఱు - ఒకటి - అఱియేన్ - ఎఱుఁగను.

మూఁడవపాశురంబునం బ్రాకృతజనులతో సంబంధమును బోఁగొట్టుకొని రామానుజుని సంబంధసంబంధుల తిరువటికళుయందునన్నుఁ జేర్చిన యుపకారమునకు మనసా నీకు సేవించుచున్నాను,

3 - వ - పాశురము.

మూ ॥ పేరియ నెంచే యటిపణిన్దేన్ ఉన్నై ప్పేయ్ప్పిఱవి
పూరియరోటుళ్ళ చుత్తం పులర్త్తి ప్పారువరుం చీర్
ఆరియన్ చెమ్మై యిరామానుచమునిక్కన్బు చెయ్యుం
చీరియ పేఱుటైయారటిక్కీ ழ் ఎన్నై చ్చేర్త్తతఱ్కే ॥

టీక ॥ పేరియ నెంచే - పేరియ - గొప్పయగు స్వభావముగల - నెంచే - మనస్సా - పేయ్ప్పిఱవి - హేయజన్మములుగలిగిన - పూరియరోటుళ్ళ - పూరియరోటు - అశుభములతోను - ఉళ్ళ - కలిగిన - చుత్తంపులర్త్తి - చుత్తం - చుట్టరికమును - పులర్త్తి - పోగొట్టి - పారువరుం చీర్ - పారువరుం - సరిలేని - చీర్ తిరుకల్యాణగుణములుగలిగిన - ఆరియన్ - సమధిగత సమస్తశాస్త్రములుగలిగిన - చెమ్మై - ఆర్జవగుణముకలిగిన - ఇరామానుచమునిక్కు - ఈ రామానుజమునికి - అన్బుచెయ్యుం - అన్బు - భక్తిని - చెయ్యుం - చేయు - చీరియ పేఱుటైయార్ - చీరియ - శ్లాఘ్యమైన - పేఱ్ - పురుషార్థమును - ఉటైయార్ - కలవారియొక్క - అటిక్కీ ழ் - తిరుపటికళయందు - ఎన్నైచ్చేర్త్తతఱ్కు - ఎన్నై - నన్ను - చేర్త్తతఱ్కు - చేర్చినందుకే - అటిపణిన్దేన్ - అటి - తిరుపటికళయందు - పణిన్దేన్ - దండముసమర్పించితిని.

---

నాలవ పాశురంబున నీప్రకారమున మీమనస్సును కొనియాడుచున్నారు ఆనాదివాసనలచేత దిరుగా నామనసు మరలదో - అనిన పరగతస్వీకారము గావున మరలదని చెప్పుచున్నారు.

౪ - వ - పాశురము.

మూ ॥ ఎన్నై ప్పువియిలొరుపొరుళాక్కి యిరుళ్ చురన్త
మున్నై ప్పవినైవెరటుత్తూ ప్రముత్తల్వానైయే
పన్నైప్పణిత్తవిరామానుచన్పరన్పాతము మేన్
చెన్నిత్తరిక్కవైత్తానెనక్కేతుంచితైవిల్లైయే ॥

టీక ॥ ఊళ్తైముతల్వనైయే - ఊళి - బ్రహ్మకల్పమునకు - ముతల్వనైయే - మొదటివానినే - పన్ని - అనుసంధించునట్లు - పణిత్త - శ్రీభాష్యముమొదలైన ప్రబంధములానతిచ్చిన - పరణ - శ్రేష్ఠుండైన - ఇరామానుచణ - ఈరామానుజుండు - ఎన్నై - నన్ను - పువియిల్ - భూమియందు - ఒరుపొరుళాకి - ఒరు - ఒక - పొరుళ్ - సొమ్ముగా - ఆక్కి - చేసి - ఇరుళ్ చురన్త - ఇరుళ్ - అజ్ఞానము - చురన్త - వర్ధకమైన - మున్నైప్పళవినై - మున్నై - అనాదియగు - పళ - పాతదియైన - వినై - కర్మమును - వేరఱుత్తు - వేర్ - వేళ్లతో - అఱుత్తు - కోసి - పాతం - తిరువటికళను - ఎన - చెన్ని - ఎన - నా - చెన్ని - శిరస్సున - తరికరవైత్తాణ - తరిక్క - ధరించునట్లు - వైత్తాణ - పెట్టెను - ఎనక్కేతుం - ఎనక్కు - నాకు - ఏతుం - ఏమియున్ను - చితవిల్లైయే - చితవు - తరువ - ఇల్లైయే - లేదు.



అయిదవపాశురంబున నవ్విధంబున మీరు స్తోత్రముచేయ వైయ్యాకరణులు నిందించరాయనిన విషయవాసి యెఱుంగనివారు దూషించిన నది భూషణంబేయగు విషయవాసియెఱింగిన వారు భక్తియుక్తమైనదని ప్రస్తుతింపుదురుగాని యిందునఁ దప్పులుగణింపరు.

౬-వ - పాశురము.

మూ ॥ ఎనక్కుఱ్ఱచెల్వమిరామానుచనెన్ఱిచైయకిల్లా
మనక్కుఱ్ఱమాన్తర్ పళిక్కిఱ్పుకళ్ పనమన్నిచీర్
తనక్కుఱ్ఱవన్పనవన్నిరు నామంకళ్ చాత్తుమెన్పాల్
ఇనక్కుఱ్ఱంకాణకిల్లార్ పత్తియేయ్ణ్తవియల్ పితన్నే॥

టీక ॥ ఎనక్కుఱ్ఱచెల్వం - ఎనక్కు - నాకు - ఉఱ్ఱ - పొందిన - చెల్వం - సంపద - ఇరామానుచనెన్ఱు - ఇరామానుచణ - ఈరామానుజుండు - ఎన్ఱు - అని - ఇచైయకిల్లా - ఒడంబడని - మనక్కుఱ్ఱమాన్తర్ - మన - మనస్సుయొక్క - కుఱ్ఱ - దోషములుగల - మాన్తర్ - మనుష్యులు - పళిక్కిల్పుక

నిందించిన - పుకళ్ - కీర్తియే - అవన్ - వాని - మన్నియచీర్ - మన్నియ పొందిన - చీర్ - కల్యాణగుణములకు - తనక్కు - తనకు - ఉరియ - తగిన అన్ పర్ - భక్తికలవారలు - పత్తిసేయ్ న్త - భక్తితోఁగూడిన - ఇయల్ విత్త - ఇయల్వు - ప్రవృత్తి - ఇతు - ఇది - అన్తు - అని - అవన్తిరునామంకళ్ చార్తియుం - అవన్ - వాని - తిరు - సంపత్కరమగు - నామంకళ్ - నామముల ను - చార్తియుం - ధరించిన - ఎన్ పాల్ - ఎన్ - నాయొక్క - పాల్ - ఛంద స్సుయొక్క - ఇనం - సమూహముయొక్క - కుత్తంకాణకిల్లార్ - కుత్తం- దోషములను - కాణకిల్లార్ - చూడనోపరు.

---

**ఆఱవపాశురమునందు క్రిందటిపాశురమునఁ జెప్పఁబడిన భక్తియు** విష యానుగుణములేని యేను స్తుతించునది యొట్టిదియని తమ్మును నిందించుచు న్నారు.

## ౬ - వ - పాశురము.

మూ॥ ఇయలుంపొరుళు మిచ్చైయత్తొట్టుత్తిన్కవికళన్పాల్
మయల్కొంటువాళ్త్తు మిరామానుచనైమతియిన్మైయాల్
పయిలుంకవికళిల్పత్తియిల్లాతవెన్ పావినెంచాల్
ముయల్కిన్ఱనన్ వన్తన్ పెరుంకీర్త్తిమొళ్ళింతిటవే॥

టీక॥ ఇయలుం - శబ్దమును - పొరుళుం - అర్థమును - ఇచ్చైయ - తగునట్టుగా- తొట్టుత్తు - కూర్చి - ఇన్కవికళ్ - మంచికవులు - అన్పాల్ - భక్తిచేత - మయల్కొంటు - మరులుకొని - వాళ్త్తుం - స్తోత్రముచేయు - ఇరామాను చనై - ఈయతిపతిని - పయిలుం - పదబంధములచేఁజేరిన - కవికళిల్ - కవి త్వములచేత - పత్తియిల్లాత - పత్తి - భక్తి - యిల్లాత - లేని - ఎన్పావినెం చాల్ - ఎన్ - నాయొక్క - పావి - పాపపు - నెంచాల్ - మనస్సుచేత - అ వన్తన్ పెరుంకీర్త్తి - అవన్తన్ - వాని - పెరుంకీర్త్తి - పెరుం - గొప్పదైన- కీర్తి - యశస్సును - మొళ్ళింతిటవే - చెప్పెదనని - మతియిన్మైయాల్ - మతి - బుద్ధి - ఇన్మైయాల్ - లేనందుచేత - ముయల్కిన్ఱన్ - ఉద్యోగించుచున్నాను.

పదవపాశురంబున క్రిందిపాశురమందు తమ్ము నిందించికొనినవారు కూరత్తాళ్వాన్ సంబంధముగలిగిన వెనుక మాకు ఏకష్టములేదని చెప్పుచున్నారు.

౭ - వ - పాశురము.

మూ॥ మొழிయైక్కడక్కుం పెరుంపుకழాన్ వంచముక్కుఱుంపాం
కుழியైక్కడక్కుంనమ్ కూరత్తాழ్వాన్ చరణన్కూటియపిన్
పழియైక్కడత్తుమిరామానుచన్ పుకழ్ పాటియల్లా
వழியైక్కడత్తలెనక్కినియావరుత్తమన్ఱే॥

టీక॥ మొழிయైక్కడక్కుం - వాచామగోచరమైన - పెరుంపుకழాన్ - పెరుం - గొప్ప - పుకழాన్ - కీర్తిగలిగిన - వంచ - కపటములైన - ముక్కుఱుంపాం - ము - మూడైన - కుఱుంపాం - కష్టములైన - కుழியైక్కడక్కుం - కుழியై - అభిజనవిత్తవిద్యలను గుంటలను - కడక్కుం - గడచిన నమ్ కూరత్తాழ్వాన్ - నమ్ - మనయొక్క - కూరత్తాழ్వాన్ - కూరత్తాழ్వానయొక్క - చరణన్కూటియపిన్ - చరణన్ - తిరువడికళను - కూటియ - ఆశ్రయించిన - పిన్ - వెనుక - పழియైక్కడత్తుం - పழியై - పాపములను - కడత్తుం గడచిన - ఇరామానుచన్ - ఈయెంబెరుమానారుయొక్క - పుకழ్ పాటి - పుకழ் - కీర్తిని - పాటి - స్తోత్రముచేసి - అల్లావழியైక్కడత్తల్ - అల్లా కాని - వழியై - మార్గములను - కడత్తల్ - దాటుట - ఎనక్కినియావరుత్తం - ఎనక్కు - నాకు - ఇనియావరుత్తం - ఇకనేమియు - వరుత్తం - కష్టము - అన్ఱే - లేదు.

---

ఎనిమిదవపాశురంబున - ఇదిమొదలుగాగల పాశురంబులందు యతిపతిని స్తోత్రముచేయుచున్నారు.

౮ - వ - పాశురము.

మూ॥ వరుత్తంపురవిరుళ్ మాఱ్ఱ వెంపొయిక్కైప్పిరాన్ మఱైయిన్
కురుత్తిన్ పొరుళైయుం చెన్దమిழ் తన్నైయుం కూట్టియొన్ఱత్
తిరుత్తిన తిరిత్త తిరువిళక్కైత్తన్ తిరువుళ్ళత్తే
ఇరుత్తుంపరమని రామానుచనెమ్మైయాళవనే॥

టీక ॥ వరుత్తం - కష్టములయిన - పురవిరుళ్ - పుర - బాహ్యావిషయములయిన - ఇరుళ్ . అజ్ఞానాంధకారమును - మాయ్ త్తిఱ - పోవునట్లు - ఎన్ పొయ్ కైప్పిరాన్ - ఎన్ - మాస్వామియైన - పొయ్కైప్పిరాన్ - పొయికాళ్వారనే - ఉపకారకులు - మఱైయిన్ వరుత్తిన్ - వేదాంతములయందుండు - పొరుళైయుం - అర్థమును - చెన్ తమిళ్ త్తన్నైయుం - మంచి ద్రావిడములను - కూట్టి - కూర్చి - ఒన్ఱ - పొందునట్లు - తిరుత్తి - చక్కపెట్టి - అన్ఱు - ఆతిగువటికళలోను సర్వేశ్వరుని జేర్చిననాడు - ఏత్తిత్త - జ్వలింపజేసిన - తిరువిళక్కై - తిరు - సంపత్కరమైన - విళక్కై - దీపమును - తన్ తిరువుళ్ళత్తే - తన్ - తమయొక్క - తిరువుళ్ళత్తే - తిరు - సంపత్కరమైన - ఉళ్ళత్తే - హృదయమందు - ఇరుత్తుం - నిలుపుకొనియున్న . పరమన్ - శ్రేష్ఠుడైన - ఇరామానుచన్ - ఈయతిపతి - ఎమ్మైయుడైయవనే - ఎం - మాకు - ఉడైయవనే - స్వామియేను.



తొమ్మిదవపాశురంబునఁ పూతత్తాళ్వారి తిరువటికళననుభవించు రామానుజునిదివ్యగుణంబులనుసంస్తించు వారు వేదమునుగాపాడి లోకమందుఁ బ్రతిష్ఠను జేయుచున్నారు.

౯ - వ - పాశురము.

మూ ॥ ఇఱైవనై క్కాణుమిదయత్తిరుళ్ కెడ జ్ఞానమెన్నుం
నిఱైవిళక్కేత్తియపూతత్తిరువటిత్తాళ్ కళ్నెంచ
త్తుఱైయవైత్తాళుమిరామానుచన్పుకళోతునల్లోర్
మఱైయినైక్కాత్తిన్త మణ్ణకత్తేమన్నవైప్పవరే ॥

టీక ॥ ఇఱైవనక్కాణుం - ఇఱైవనై - స్వామియైనసర్వేశ్వరుని - కాణుం - కాంచుటకు - ఇతయత్తి - హృదయమునందు - ఇరుళ్ - అజ్ఞానాంధకారము - కెట - నశించునట్లు - జ్ఞానమెన్నుం - జ్ఞానమను - నిఱైవిళక్కు - పూర్ణదీపమును - ఏత్తియ - ప్రకాశింపఁజేసిన - పూత తిరువటిత్తాళ్ కళ్ - పూతత్తాళ్వారి తిరువటికళను - నెంచత్తుఱైయ - మనస్సునఁ బొందునట్లుగా - వైత్తు - ఉంచుకొని - ఆళుం - అనుభవించు - ఇరామానుచన్ - ఈయతిపతియొక్క -

పుకళ్లో-కీగిని - ఓతుం-అనుసంధించు - నల్లోర్ - మంచివారలు - సుత్రైయానై వేదమును - కాత్తు - కాపాడి - ఇంతమణ్ణకత్తే - ఈభూమియందే - మన్న - సుప్రతిష్ఠితమవునట్లు - వైప్పవరే - నిలుపువారు.



పదియవపాశురంబునందు పేయాళ్వారితిరువటికళను స్తుతించు స్వభావముగల రామానుజునియందుఁబ్రియముగలవారి తిరువటికళను శిరసావహించువారు మనసా యెప్పటికిని స్తోత్రార్హులని చెప్పుచున్నారు. -

౧౦ - వ - పాశురము.

మూ ॥ మన్నియపేరిరుళ్ మాంటపిన్ కోవలుళ్ మామలరాళ్
తన్నొటుమాయనైక్కంటమై కాట్టుంతమిళ్త్తలైవన్
పొన్నటిపోఱ్ఱుమిరామానుచన్ కన్బుపూంటవర్ తాళ్
చెన్నియిఱ్ చూటుంతిరువుడైయారెన్ఱుంచీరియరే॥

టీ ॥ మన్నియపేరిరుళ్ - మన్నియ - పొందిన - పేరిరుళ్ - పేర్ - పెద్ద - ఇరుళ్ - చీకటి - మాంటపిన్ - పోయిన వెనుక - కోవలుళ్ - తిరుక్కోవలూరను - మామలరాళ్ - తన్నొటు - మా - పవిత్రమైన - మలర్ - పుష్పము - ఆళ్ - వాసస్థానముగాఁగల పెరియపిరాట్టితో - తన్నొటుం - కూడా - ఆయనై - కృష్ణుని - కంటమె - కనుటను - కాట్టుం - చూపుచున్న - తమిళ్త్తలైవన్ - తమిళ్ - ద్రవిడవేదమునకు - తలైవన్ - శ్రేష్ఠుఁడయిన పేయాళ్వారియొక్క - పొన్నటి - పొన్ - మనోజ్ఞమయిన - అటి - తిరువటికళను - పోఱ్ఱుం - స్తోత్రముచేయు - ఇరామానుచన్ - ఈరామానుజునియొక్క - అన్పు పూంటవర్ - అన్పు - భక్తిని - పూంటవర్ - ఆభరణముగాధరించిన వారియొక్క - తాళ్ - తిరువటికళను - చెన్నియిల్ చూటుం - చెన్నియిల్ - తిరుముటియందు చూటుం - ధరించిన - తిరువుడైయార్ - తిరు - సంపదను - ఉడైయార్ - కలవారు - ఎన్ఱుం - ఎన్నటికిని - చీరియరే - శ్లాఘ్యులే.



పదిమొకండవపాశురంబునఁ తిరుప్పాణాళ్వారి తిరువటికళను శిరసా

వహించురామానుజుని నాశ్రయించినవారికార్యవైలక్షణ్యమునాచేఁ జెప్ప నలవికాదనుచున్నారు.

౧౧ - వ - పాశురము.

మూ॥ చీరియనాన్మఱైచ్చెంపొరుట్ చెంతమిழாలళిత్త
పారియలుంపుకழ்ప్పాణ్ పెరుమాళ్ చరణాంపతుమ
త్తారియల్ చెన్నియిరామానుచన్ఱన్నైచ్చారన్దవర్తమ్
కారియవణ్మైయెన్నాల్ చొల్లొణాతిక్కటలిటత్తే॥

టీక॥ చీరియనాన్మఱై - చీరియ - శ్లాఘ్యమైన - నాన్మఱై - నాలుగువేదములయొక్క - చెంపొరుళ్ - చెం - సరసమైన - పొరుళ్ - అర్థమును - చెంతమిழாల్ - మంచిద్రావిడములచేత - అళిత్త - ప్రబంధముచేసియుపకరించిన - పారియలుం - భూమియందుప్రసిద్ధించు - పుకழ் - కీర్తినిగల - పాణ్ పెరుమాళ్ - తిరుప్పాణాళ్వారియొక్క - చరణాంపతుమత్తాల్ - చరణాం - తిరువటికళను - పతుమత్తాల్ - తామరపుష్పములచేత - ఇయల్ - అలంకృతమైన - చెన్ని - తిరుముటిగల - ఇరామానుచన్ - ఈరామానుజుఁడు - తన్నై - తన్ను - చారన్దవర్తమ్ - చేరినవారియొక్క - కారియవణ్మై - కారియ - అనుష్ఠానములయొక్క - వణ్మై - వైలక్షణ్యము - ఇక్కటలిటత్తు - ఇక్కటల్ - ఈసముద్రముచేఁజుట్టఁబడిన - ఇటత్తు - భూమియందు - ఎన్నాల్ - నాచేత - చొల్లొణాతు - చెప్పశక్యముగాదు.

---

పదిరెండవపాశురంబునఁ దిరుప్పాణాళ్వారితిరువటికళకు స్థానమైన హృదయముగల రామానుజుని నాశ్రయించినవారిని నేనాశ్రయించుచున్నానని చెప్పుచున్నారు.

౧౨ - వ - పాశురము.

మూ॥ ఇటంకొంటకీర్తిమழிచైక్కిఱైవనిణైయటిప్పో
తటంకుమితయత్తిరామానుచనమ్పొఱ్ప్పావతమెన్ఱు
కటంకొంటిఱైంచుం తిరుమునివర్కన్ఱిక్కాతల్ చెయ్యా
త్తిటంకొంటఞ్ఞానియర్కే యటియేననుపు చెయ్వతువే॥

టీక ॥ ఇటంకొంటు - ఇటం - భూమియంతట - కొంటు - వ్యాపించిన - కీర్తి - కీర్తికలిగిన - మఱ్ఱైచ్చెక్కిత్తైవన్ - మఱ్ఱైచ్చెక్కు - తిరుమఱ్ఱైశికి - ఇత్తైవన్ - స్వామియైనతిరుమఱ్ఱైయాళ్వారియొక్క - ఇణైయటిప్పోతు - ఇణై - జోడైన - అటి - తిరువటికళను - పోతు - పుష్పములు - అటంకుం - అమరిన - ఇతయత్తు - హృదయముగల - ఇరామానుశన్ - ఈరామానుజునియొక్క - అంపొఱ్ ప్పాతం - అం - సుందరమైన - పొఱ్ పాతం - స్పృహణీయ్యమైనతిరువటికళు - ఎన్నుం - సార్వకాలమును - కటంకొంటు - ప్రాప్తమని - ఇఱైంచుమ్ తిరు - ఇఱైంచుమ్ - శేవించెడు - తిరు - సంపదఁగల - మునివర్కళ్ళ - మననశీలులైనవారికిఁగాని - కోతల్ చెయ్యా - భక్తిచేయుని - తిటంకొంటు - తిటం - దృఢమును - కొంట - కలిగిన - జ్ఞానియర్కు - జ్ఞానాధికులకే - అవియెనన్పు చెయ్వతువే - అటియేన్ - దాసుఁడైననేను - అన్పు - భక్తి - చెయ్వతువే - చేయునది.

---

పదమూఁడవ పాశురంబున తొంటరటిప్పొటియాళ్వారి సంబంధమును జెప్పుచున్నారు.

౧౩ - వ - పాశురము.

మూ ॥ శెయ్యుంపచున్ తుళవత్తొళ్ఱై మాలెయుంచెన్తమిళ్ఱ్ ఱ్
పెయ్యుమఱైత్తమిళ్ మాలైయుం పేరాతచీరరంక
త్తైయన్ కళ్ఱ్ఱుణియుంపరన్తాళన్ఱియాతరియా
మెయ్యనిరామానుచన్ చరణేకతివేఱెనక్కే ॥

టీక ॥ శెయ్యుం - తమచేఁజేయఁబడిన - పచున్ తుళవ - పచున్ - పసిమిగల - తుళవ - తిరుత్తుళాయిచేతను - తొళ్ఱై - కట్టిన - మాలైయుం - మాలలను - చెంతమిళ్ఱ్ ఱ్ - మంచిద్రావిడశబ్దములచేత - పెయ్యుం - ఘటించిన - మఱై - వేదస్వరూపమైన - తమిళ్ మాలైయుం - ద్రావిడరూపమైన - తిరుమాలైయను ప్రబంధమును - పేరాతచీర్ - పేరాత - నిత్యసిద్ధమయిన - చీర్ - కల్యాణగుణములుకలిగిన - అరంకత్తయ్యన్ - నంపెరుమాళ్లయొక్క - కళ్ఱ్ కణియుం - కళ్ఱ్ కు - తిరువటికళకు - అణియుం - సమర్పించునట్టి -

పరః - శ్రేష్ఠుఁడైన - తొంటరటిప్పాటియాళ్వారియొక్క - తాళ్గళ్ని - తిరువటి కళుదప్ప - ఆతరియా - ఆదరించని - మెయ్యః - సత్యశీలుఁడైన - ఇరామానుచః - ఈరామానుజునియొక్క - చరణే - తిరువటికళే - ఎనక్కు - నాకే - వేరు - విశేషమైన - గతి - ఉపాయము.

---

పదునాలుగవ పాశురంబున కులశేఖరాళ్వారి సంబంధమును జెప్పు చున్నారు.

౧౪ - వ - పాశురము.

మూ॥ కతిక్కుప్పతఱి వెంకానముం కల్లుం కటలుమెల్లాం
కొతికర త్తవంచెయ్యుం కొళ్ కైయల్లేః కొల్లికావలఃచొళ్
పతిక్కుంకలైక్కవిపాటుం పెరియవర్ పాతంకళే
తుతిక్కుంపరమని రామానుచ నెన్నైచ్చోర్విలనే॥

టీక॥ కొల్లికావలః - కులశేఖరాళ్వారియొక్క - చొల్ - శ్రీసూక్తులను - పతిక్కుం - కూర్చిన - కలైక్కవి - కలై - శాస్త్రరూపమయిన - కవి - పెరుమాళ్ తిరుమొళ్రని - పాటుం - చదివెడు - పెరియవర్ - పెద్దలయొక్క - పాతంకళే - పాతములనే - తుతిక్కుం - స్తోత్రముచేయు - పరమః - శ్రేష్ఠుఁడైన - ఇరామానుచః - ఈరామానుజుఁడు - ఎన్నై - నన్ను - చోర్విలనే - దిగవిడువరుగనుక - కతిక్కుప్పతరి - కతికు - ప్రాప్యలాభమునకు - పతరి - ఆతురపడి - వెంకానముం - వెం - క్రూరమైన - కానముం - అడవియు - కల్లుం - పర్వతములును - కటలుం - సముద్రమును - ఎల్లాం - అన్నియు - కొతికర - తపించునట్లు - తవం - తపస్సు - చెయ్యుం - ఒనర్చు - కొళ్ కై - స్వభావమును - అల్లేః - విడిచితిని.

---

పదియేనవపాశురంబున పెరియాళ్వారిసంబంధ మానతిచ్చుచున్నారు.

౧౫ - వ - పాశురము.

మూ॥ చోరాతకాతల్ ప్పెరుంచుழప్పాల్ తొల్లైమాలైయొన్ఱుం
పారాతవనైప్పల్లాండెన్ఱు కాప్పిడుం పాన్మైయన్ తాళ్
ప్పేరాతవుళ్ళత్తిరామానుచన్ తన్ పిఱంగియ చీర్
చ్చారామనిచరైచ్చేరేననక్కెన్న తాழ్ వినైయే॥

టీక॥ చోరాత - జారని - కాతల్ - భక్తియొక్క - పెరుంచుழప్పాల్ పెద్దసుడిచేత - తొల్లైమాలై - తొల్లై - అనాదియైన - మాలై - సర్వేశ్వరుని ఒన్ఱుం - సర్వజ్ఞత్వసర్వశక్త్యాదులొకటిని - పారాతే - చూడక - అవనై - ఆ సర్వేశ్వరుని - పల్లాండెన్ఱు - పల్లాండని - కాప్పిడుం - మంగళాశాసనముచేసిన - పాన్మైయన్ - స్వభావముగల పెరియాழ్వారియొక్క - తాళ్ - తిరువడికళను - పేరాత - విడువని - ఉళ్ళత్తు - మనస్సుగల - ఇరామానుచన్ - ఈ రామానుజునియొక్క - తన్ పిఱంగియ చీర్ - తన్ పిఱంగియ - నిరవధికమైన - చీర్ - కల్యాణగుణములను - చారామనిచరై - చేరని మనుష్యులను - చేరేన్ - చేరను - ఎనక్కెన్న తాழ్ వినియే - ఎనక్కెన్న - నాకేమి - తాழ్ వినియే - కొదువ.

---

పదియాఱవపాశురంబున చూడికొడుత్తనాచ్చారు సంబంధమును జెప్పుచున్నారు.

౧౬ - వ - పాశురము

మూ॥ తాழ్ వొన్ఱిల్లామఱైత్తాழ్ న్దు తలముழుదుం కలియే
ఆళ్ కిన్ఱనాళ్ వన్దళిత్తవన్ కాణ్ మినరంకర్ మౌళి
చూழ్ కిన్ఱమాలైయై చ్చూడికొడుత్తవళ్ తొల్లరుళాల్
వాழ్ కిన్ఱవళ్ళలిరామానుచనెన్నుమామునియే॥

టీక॥ అరంకర్ మౌళి - అరంకర్ - నంపెరుమాళ్లయొక్క - మౌళి - తిరుముడియందు - చూழ్ కిన్ఱమాలైయై - చూழ్ కిన్ఱ - ధరించెడు - మాలైయై -

తిరుహూలను - చూటిన్కుటు త్తవళ్ - చూటి - ధరించి కుటుత్తవళ్ - ఇచ్చిన ఆండాళుయొక్క - తొల్లగుళ్ళాల్ - తొల్ - స్వాభావికమైన - అరుళ్ళాల్ కృపచేత - వాళ్ఖ్ కిన్ర - ఉజ్జీవించుచున్న - వళ్లల్ - ఔదార్యగుణముగలిగిన- ఇరామానుచన్నెన్నుంమామునియే - ఇరామానుచన్నెన్నుం - ఈరామానుజుండను - మామునియే - మహామునియే - తాళ్ వ్రైన్రిల్లా - తాళ్ - తన్కువ-ఒన్రు - ఒకటి - ఇల్లా - లేని - మరై - వేదములు - తాళ్ దాతు - ఇతరములచేం తన్కువపడి - తలైముట్రుతుం - ప్రపంచమంతయు - కలియే - కలికాలమ్మే - ఆళ్ కిన్ర - పాలించెడు - నాళ్ - దినమందు వద్దాతు - వచ్చి - అళిత్తనర - రక్షించినవారు - కాణీమిన - చూడుమీ.

---

పదియేడవపాశురంబున తిరుమంకైయాళ్వారియందే స్నేహము గలరామానుజుని నాశ్రయించినవారు సుఖదుఃఖములకుం జలించరని చెప్పుచున్నారు.

౧౭ - వ - పాశురము.

మూ ॥ మునియార్తుయిరంకళ్ ముడ్తినుమిన్బంకళ్ మొయ్త్తిటినుం
కనియార్మనంకణ్ణమంకైనిన్రానైక్కలైపరవుం
తనియానైత్తంటమిళ్ నూల్ చెయ్తనీలన్ తనక్కులకిల్
ఇనియానైయెంకళిరామానుచనైవన్దెయ్తినరే॥

టీక ॥ కలైపరవుం - కలై - శాస్త్రములచే - పరవుం - స్తోత్రముచేయంబడుచున్న - తనియానై - తని - అద్వితీయమ్మైన - ఆనై - మత్తగజమువంటి యాధిక్యముగల - కణ్ణమంకైనిన్రానై - కణ్ణమంకై - తిరుక్కణ్ణమంగను - నిన్రానై - నిత్యవాసముచేసిన సర్వేశ్వరునిగూర్చి - తంటమిళ్ నూల్ చెయ్త - తం - పాపహరమయిన - తమిళ్ నూల్ - ద్రావిడప్రబంధములను - చెయ్త-చేసిన - నీలన్ తనక్కు - తిరుమంకైయాళ్వారికి - ఉలకిల్ - ఈలోకమందు- ఇనియానై - స్నేహితుండైన - ఎంకళిరామానుచనై - ఎంకళ్ - మాయొక్క - ఇరామానుచనై - ఈరామానుజుని - వన్దు - వచ్చి - ఎయ్తినర్ - ఆశ్రయించినవారు - తుయరంకళ్ - దుఃఖములు - మొయ్త్తిటినుం - తన్న

జరినను - మునియార్ - దుఃఖపడరు - ఇకె - పకె - కళ్ - సుఖములు - మొళుప్ త్తి
టినుం - మునురుకొనినను - మనంకనియార్ - మనం - మనస్సు - కనియార్ - మెత్తబడరు.

పదునేనిమిదవపాశురంబు మధురకవియాళ్వారి తిరుకల్యాణగుణములను - సకలాత్మలు - ఉజ్జీవించునట్లు చేసిన రామానుజుడు మాకు బలమైన సహాయమని చెప్పుచున్నారు.

౧౮ - వ - పాశురము.

మూ॥ ఎయ్ తఱ్ఱరియమఱైకళై యాయిరమిన్ తమిళ్ఱాల్
చెయ్ తఱ్కులకిల్ వరుం చటకోపనై చ్చిన్తైయుళ్లే
పెయ్ తఱ్కిశైయుం పెరియవర్ చీరై యుయిర్ కళెల్లాం
ఉయ్ తఱ్కుతవు మిరామానుచ నెమ్మురుతుణైయే॥

టీక॥ ఎయ్ తఱ్ఱ - ఎఱుంగుటకు - అరియ - దుర్లభమైన - మఱైకళై - వేదములను - ఆయిరం - సహస్రసమయిన - ఇన్ - తమిళ్ఱాల్ - ఇన్ - సరసమైన - తమిళ్ఱాల్ - ద్రావిడములచేత - చెయ్ తఱ్కు - చేయుటకు - ఉలకిల్ - భూమికి - వరుం - వేంచేసిన - చటకోపనై - నమ్మాళ్వారిని - చిన్తైయుళ్లే - మనస్సునందు - పెయ్ తఱ్ఱ - ఉంచుకొనుటకు - ఇశైయుం - సమ్మతించిన - పెరియవర్ - పెద్దలైన - శ్రీమధురకవియాళ్వారియొక్క - చీరై - తిరుకల్యాణగుణములను - ఉయిర్ కళెల్లాం - చేతనులందరు - ఉయ్ తఱ్కు - ఉజ్జీవించుటకు - ఉతవుం - ఉపదేశముచేయుచున్నట్టి - ఇరామానుచన్ - ఈరామానుజుడు - ఎమ్మురుతుణైయే - ఎం - నాకు - ఉఱు - గొప్పదైన - తుణైయే - తోడు.

పందొమ్మిదవపాశురంబున అయిశ్వర్యము మొదలు పరదేవతాపర్యంతమైన యపేక్షవస్తువులన్నియు: తమకు: తిరువాయ్ మొళియని జగత్ప్రసిద్ధముగా నిలిచిన రామానుజుడు: నాకునిరతిశయభోగ్యులని చెప్పుచున్నారు.

౧౯ - వ - పాశురము.

మూ॥ ఉఱువెరుం శెల్వముం తన్దైయుం తాయుముయర్ కురువుం
వెఱితరుపూమకళ్ నాతనుమ్మాఱన్ విళంకియచీర్
నెఱితరుంచెంతమిళారణమేయెన్ఱునీళిలత్తోర్
అఱితరనిన్ఱవిరామానుచనెనక్కారముతే॥

టీక॥ ఉఱువెరుంశెల్వమున్ - ఉఱు - శ్లాఘ్యమైన - పెరుం - గొప్పదియైన - చెల్వముం - సంపదయును - తన్దైయుం - తండ్రియును - తాయుం - తల్లియును - ఉయర్ కురువుం - ఉయర్ - ఉత్కృష్టులయిన - కురువుం - ఆచార్యులును - వెఱి - పరిమళమును - తరు - ఇచ్చునట్టి - పూమకళ్ - పూ - పుష్పమునకు - మకళ్ - కుమార్తెయైన పెరియపిరాట్టికి - నాతనుం - వల్లభుడైన సర్వేశ్వరుడు - మాఱన్ - నమ్మాళ్వారికి - విళంకియ - భగవత్ప్రసాదముచే ప్రకాశించిన - చీర్ - కల్యాణగుణములయొక్క - నెఱి - పర్యాయమును - తరుం - ఇచ్చునట్టి - చెంతమిళారణమే - చెంతమిళ్ - సుందిద్రావిడమైన - ఆరణమే - వేదమే - ఎన్ఱు - అని - నీళిలత్తోర్ - ఈమహాభూమినిగలవారు - అఱితర - ఎఱుగునట్లు - నిన్ఱ - అనన్యార్హులుగానిలచిన - ఇరామానుచన్ - ఈ రామానుజుడు - ఎనక్కు - నాకు - ఆరముతు - అతృప్తామృతస్వరూపుడు.

---

ఇరువదవపాశురంబున శ్రీమన్నాథమునులను తమ తిరువుళ్లమందుంచుకొని యనుభవించు రామానుజుడు నాకుఁ బరమధనమనుచున్నారు.

౨౦ - వ - పాశురము.

మూ॥ ఆరప్పొళిల్ తెన్ కురుకైప్పిరాన ముతవాయ్
ఈరత్తమిళిన్ నిచైయుణర్న్తోర్ కట్కినియవర్ తం
చీరైప్పయిన్ఱుయ్యుం చీలంకొళ్ నాతమునియై నెంజాల్
వారిప్పరుకుమిరామానుచనెన్ఱన్ మానిలియే॥

టీక॥ ఆరప్పొళిల్ - చందనపుతోపులుగలదియును - తెన్ - దర్శనీయమైన కురుకైప్పిరాన్ - కురుకై - తిరునగరికి - పిరాన్ - నాథుడైన శఠగోప

నిరెయొక్క-అముతశ్శిరువాయ్-అమ్మృత - అమ్మృతమువంటి - తిరు - సంపత్క రమైన - వాయ్ - తిరుప్పవళ్ళమందు బుట్టిన - ఈరత్తమిళ్ - ఈర - చల్లని తమిళ్ - ద్రవిడవేదముయొక్క - ఇచ్చైయుణర్ంతోర్కట్కు - ఇచ్చై - గానమును - ఉణర్ంతోర్కట్కు-ఎఱింగినవారికి - ఇనియవర్తం - స్నే హితులైనవారియొక్క - శీరైప్పయి-ఉయ్యుం - శీరై - తిరుకల్యాణగు ణములను - పయిన్ఱ - అనుభవించి - ఉయ్యుం - ఉజ్జీవించే - శీలంకొ - స్వ భావముగల - నాతమునిధ్యై - శ్రీమన్నాథమునులను - నెంచాల్ - మనస్సు చేత - వారిప్పగుకుం - మహాదాశచేననుభవించు - ఇరామానుచన్ - ఈరా మానుజుడు - ఎన్ఱన్ - మాకు - మానిధియే - మా - సంపత్కరమైన - నిధి యే - నిధి.



యిరువదియొక్క-పాశురంబున శ్రీయామునవందారుల తిరువటికళ సంబం ధముగల రామానుజుడు నన్ను రక్షించెనుగనుక - ఇక నీచులయిన్లనుంభో యి వారిని నుతించనని చెప్పుచున్నారు.

౨౧ - వ - పాశురము.

మూ ॥ నిత్తియైప్పొ ఱ్ఱియు ముకిలెన్ననీచర్తంవాచల్పత్తి
తుతిక ఱ్ఱులకిత్తుంవళ్ క్కిని లేసనిత్తూయ్నెఱిచేర్
యతికట్కిఱైవన్ యమునైత్తుఱైవనిణైయుటియాం
కతిపెఱ్ఱుడైయు వి రామానుజనెన్నై కాత్తననే ॥

టీక ॥ తూయ్నెఱిచేర్ - తూయ్ - పరిశుద్ధమైన - నెఱి - మిక్కిలి - చేర్ - అనుష్ఠానముగల - యతికళ్కు - సన్యాసులకు - ఇఱైవన్ - స్వామియైన - యమునైత్తుఱైవన్ - యామునాచార్యులయొక్క - ఇణైయుటియాం - పరస్ప రసదృశమైన తిరువటికళనెడి - కతిపెఱ్ఱుడైయు - ప్రాప్యలాభముగల - ఇ రామానుచన్ - ఈరామానుజుడు. ఎన్నై - నన్ను - కాత్తనన్ - రక్షించి నారుగనుక - ఇని - ఇకను - నిధియై - నిధిని - పొఱ్ఱియుం - వర్ణించు - ముకిలెన్న-

మేఘుమని - నీచరత్తం - నీచుల - వాచల్ - వాకిళ్లు - పత్తిసి - పట్టికొని - తుతి-స్తోత్రములు - కత్తిఱుం - నేర్చుకొని - ఉలకిల్ - లోకమందు - తువళ్ కిన్ఱిలేఁ తిరుగగలవాఁడనుగాను.



ఇరువదిరెండవ పాశురంబున దేవతలకొఱకు బాణాసురుని గఱించిన సర్వేశ్వరుని స్తుతించు రామానుజుడు నాకు - ఆపద్ధనమని చెప్పుచున్నారు.

౨౨ - వ - పాశురము.

మూ॥ కార్త్తికైయానుం కరిముకత్తానుం కనలుముక్కణ్
మూర్త్తియుమోటియుం వెప్పముతుకిట్టుమూవులకుం
పూత్తవనే యెన్ఱు పోత్తిసెట వాణన్ పిళ్లైపొఱుత్త
తీర్త్తనై యేత్తుమి రామానుచ నెన్ఱ శేమవైప్పే ॥

టీక॥ కార్త్తికైయానుం - సుబ్రహ్మణ్యుఁడును - కరిముకత్తానుం - గజముఖుఁడును - కనలు - అగ్నియును - ముక్కణ్ - మూర్త్తియుం - ముక్కణ్ - మూడు కన్నులుగల - మూర్త్తియుం - స్వరూపముగల శివుడును - మోటియుం - దుర్గయును - వెప్పం - జ్వరమున్ను - ముతుకిట్టు - ముతుకు - వెన్ను - ఇట్టు - ఇచ్చి - మూవులకుం - మూడులోకములును - పూత్తవనే - పుట్టించినస్వామీ - ఎన్ఱు - అని - పోత్తిసెట - స్తుతించగా - వాణన్ - బాణాసురునియొక్క - పిళ్లై - నేరమును - పొఱుత్త - ఓర్చిన - తీర్త్తనై పరిశుద్ధుఁడైన సర్వేశ్వరుని - ఏత్తుం - స్తుతించు - ఇరామానుచన్ - ఈ రామానుజుఁడు - ఎన్ఱన్ - నాయొక్క - శేమ - క్షేమముకొఱకు - వైప్పు - నిక్షేపము.



ఇరువదిమూడవపాశురంబున నిర్దోషప్రేమయుక్తులైనవారు తమకుఁ బరమధనముగా ననుభవించువిషయమును బాపిష్ఠుఁడైన నేను స్తుతింపుచున్నాఁడ-యిది యావిషయమునకేమవునో అని చెప్పుచున్నారు.

౨౭ - వ - పాశురము.

మూ॥ వైప్పాయవాన్ పొరుళ్ ఎన్ఱు నల్లన్బర్ మనత్తకత్తే
ఎప్పోతుం వైక్కుమిరామానుచనై యిరునిలత్తిల్
ఒప్పారిలాత వుఱువినైయేన్ వఞ్చ నెఞ్చిల్ వైత్తు
ముప్పోతుం వాழ்త్తువనెన్నామితువవన్ మొయ్పుకழ்క్కే॥

టీక॥ వైప్పాయ-ఆపన్నిమిత్తమునిక్షేపింపఁబడిన-వాన్ పొరుళ్ ఎన్ఱు-వాన్-అక్షయమైన-పొరుళ్-ధనము-ఎన్ఱు-అని-నల్లన్బర్-మంచిప్రేమగలవారు-మనత్తకత్తే-హృదయమందు-ఎప్పోతుం-ఎప్పుడును-వైక్కుం-ఉంచికొనియున్న-ఇరామానుచనై-ఈరామానుజుని-ఇరునిలత్తిల్-మహాభూమియందు-ఒప్పారిలాత-ఒప్పార్-సరియొప్పువారు-ఇలాత-లేని-ఉఱువినైయేన్-ఉఱు-అధికమైన-వినై-పాపిష్ఠుఁడనైన-ఏన్-నేను-వఞ్చనెఞ్చిల్-వఞ్చ-కపటమైన-నెఞ్చిల్-చిత్తమందు-వైత్తు-ఉంచుకొని-ముప్పోతుం-త్రిసంధ్యలయందు-వాழ்త్తువన్-స్తోత్రముచేయుచున్నాఁడను-ఇతు-ఇది-అవన్-వాని-మొయ్పుకழ்క్కే-తిరుకల్యాణగుణములకే-ఎన్నాం-ఏమవునో.

---

ఇరువదినాలుగవ పాశురమందు సరిలేని పాపిష్ఠులైన తమకీ విషయమును స్తుతించుట కెట్లుకూడునని నన తమముందరినిలకడయును తనుకీ-ఉత్కర్షమిప్పుడువచ్చినమార్గమును జెప్పుచున్నారు.

౨౮ - వ - పాశురము.

మూ॥ మొయ్త్తవెన్తీవినైయాల్ పల్లుటల్తోఱుం మూత్తతనాల్
ఎయ్త్తొழிన్తేన్ ముననాళ్కళెల్లాం ఇన్ఱు కణ్టుయర్న్తేన్
పొయ్త్తవమ్పోఱ్ఱుం పులైచ్చమయఙ్కళ్ నిలత్తవియ
కైత్తమెయ్జ్ఞానత్తిరామానుచనెన్నుం కార్తన్నైయే॥

టీక॥ మొయ్త్త-ముసురుకొనిన-వెన్తీ-అనుభవప్రాయశ్చిత్తవినాశనములుగాక-అతిక్రూరమైన-వినైయాల్-కర్మముచేత-పల్లుటల్తోఱుం-

కుల్ - అనేకములైన - ఉడంబోడుం - దేహములతోను - మూత్తు - ముదిసి - అతనాల్ - అందుచేత - ఎయ్ త్తొఴిన్ దేన్ - బడలితిని - ముననాళ్ కళెల్లాం - వెనకటిదినములన్ని - పొయ్ త్తవం - అబద్ధపుతపములను - పోఱ్ఱుం - చేయు - పులచ్చమయంకళ్ - నీచసమయములను - నిలత్తు - భూమియందు - అవియ - మడియునట్లు - మెయ్ జ్ఞానత్తు - నిజమైనజ్ఞానమును - కఱ్ఱు - నేర్చిన - ఇరామానుచనెన్నుం - ఈరామానుజుఁడను - కార్ తన్నై ఎయ్ - మేఘమును - ఇన్ఱు - నేఁడు - కండు - తమనిర్హేతుకకృపచేఁజూపఁగాఁగని - ఉయర్ న్ దేన్ - అధికుండనైతిని.



ఇరువది మొదవ పాశురంబున శఠగోపంపొన్నడి తనవిషయమందుఁ జేసిన యుపకారమనుసంధించి యందుచే వాగితిగుముఖమండలమునుజూచి దేవరవారి కృపాస్వభావ మీలోకమందెవ్వరెఱుంగుదురని చెప్పుచున్నారు.

౨౧ - వ - పాశురము.

మూ॥ కారేయ్ కరుణై యిరామానుచా విక్కడలిడత్తిల్
యారే యఱివర్ నిన్నరుళిన్ తన్మై యల్లలుక్కు
నేరే యుఱైవిడనాన్ వన్దు నీయెన్నై యుయ్త్తపిన్నున్
శీరే యుయిర్ క్కుయిరాయడియేఱ్ కిన్ఱు తిత్తిక్కుమే॥

టీక॥ కారేయ్ కరుణై - కార్ - మేఘముతో - ఏయ్ - సమానమైన - కరుణై - కృపఁగల - ఇరామానుచా - ఓయిరామానుజా - అల్లలుక్కు - దుఃఖములకు - నేరే - యుఱైవిడనాన్ - నేరే - నేరుగా - ఉఱై - నివాసమునకు - ఇడ - స్థలమైన - వాఁడనైన - నాన్ - నేను - వన్దు నీ - నీ - నీవు - వన్దు - వేంచేసి - ఎన్నై - నన్ను - ఉయ్త్తపిన్ - ఉయ్త్త - ఉజ్జీవించిన - పిన్ - వెనుక - ఉన్ శీరే - ఉన్ - దేవరవారి - శీరే - తిరుకల్యాణగుణములే - ఉయిర్క్కు - నాయాత్మకు - ఉయిరాయ్ - ధారకమై - అడియేఱ్కు - ఆటదానికి - ఇన్ఱు - నేఁడు - తిత్తిక్కుం - రసించుచున్నది - ఉన్నరుళిన్ - ఉన్ - దేవరవారి - అరు

కి౯ - కృపయొక్క - త౯మై - స్వభావమును - ఇక్కుటలిట త్తిల్ - ఇక్కుటల్ - ఈసముద్రముచేఁజుట్టఁబడిన - ఇట త్తిల్ - భూమియందు - ఆరే యఱి పవర్ - ఆరే - ఎవ్వరు - అఱిపవర్ - ఎఱుంగఁగలరు.

---

ఇరువైయాఱవ పాశురంబున రామానుజుఁడు విషయీకరించినవెనుక వారితిరుకల్యాణగుణములే తమకు ధారకమయ్యెనని క్రిందటిపాటయం దానతిచ్చిరి - ఈపాశురంబునం దంతియేకాక వారితిరువటికళయం దనన్యార్హులయిన శ్రీవైష్ణవులయొక్క పూర్వావస్థలలోపల - ఒక్కటొకటి నన్నెఱుచున్నదని చెప్పుచున్నారు.

౨౭ - వ - పాశురము.

మూ ॥ తిక్కుఱ్ఱకీర్త్తియిరామానుచనైయె౯ చెయ్ వినైయాం
మెయ్క్కుఱ్ఱనీక్కి విళంకియమేకత్తైమేవునల్లోర్
ఎక్కుఱ్ఱవాళరెతుపిఱప్పేతియల్ వాకనిన్ఱోర్
అక్కుఱ్ఱమప్పిఱప్పవ్వియల్వేనమ్మైయాట్కొళ్ళుమే ॥

టీక ॥ ఎ౯చెయ్వినైయాం - ఎ౯ - నాచే - చెయ్ చేయఁబడిన - వినైయాం - కర్మస్వరూపమైన - మెయ్కుఱ్ఱనీక్కి - మెయ్ - యదార్థమైన - కుఱ్ఱ - దోషమును - నీక్కి - పోఁగొట్టి - విళంకియమేకత్తై - విళంకియ - ఆశ్రితవిరోధి నిరసనమునుజేసితిమిగదాయని సంతోషముచేఁ బ్రకాశించెడు - మేకత్తై - మేఘముతో సమానుఁడైన - తిక్కుఱ్ఱకీర్త్తి - తిక్ - దిక్కులయందు - ఉఱ్ఱ - వ్యాప్తమైన - కీర్త్తి - యశస్సుగల - ఇరామానుచనై - ఈరామానుజుని - మేవునల్లోర్ - మేవు - ఆశ్రయించిన - నల్లోర్ - విలక్షణులు - ఎకుఱ్ఱవాళర్ - ఏ తక్కువనుగలవారై - ఎతుపిఱప్పు - ఏజన్మముగలవారై - ఏతియల్వు ఏవృత్తికలవారై - నిన్ఱోర్ - ఉండిరి - అక్కుఱ్ఱం - ఆతక్కువ - అప్పిఱప్పు - ఆజన్మము - అవ్వియల్వు - ఆవృత్తియు - నమ్మై - మమ్మును - ఆళ్ కొళ్ళుమే ॥ ఏలుకొనునే ॥

ఇరువదియేడవపాశురంబున నీప్రకారము తమకనన్యార్హులైన శ్రీవైష్ణవుల యందుఁ - బ్రవీణులైనగాని రామానుజుఁడు వీరిమనస్సుననిలువరు అట్లునిల చిన పాపిష్ఠుఁడైననామనస్సున దేవరవారు ప్రవేసించిన మీప్రభావమునకుఁ దగినవకాదాయని నామనస్సుచలించుచున్నదని చెప్పుచున్నారు.

౨౭ - వ - పాశురము.

మూ ॥ కొళ్ళక్కుఱైవఱ్ఱిలఙ్గికొఴున్దువిట్టోఙ్గియవున్
వళ్ళల్తనత్తినాల్ వల్వినైయేన్మననీపుగున్దాయ్
వెళ్ళైచ్చుడర్విడుమున్పెరుమేన్మైక్కిఴుక్కిదు తెన్ఱు
తళ్ళుత్తిరిరంగుమిరామానుచావెన్ఱనినెంచమే ॥

టీక ॥ కొళ్ళక్కుఱైవఱ్ఱు - కొళ్ళ - అనుభవించఁగా - కుఱై - తక్కువ - అఱ్ఱు - లేక - ఇలంకి - ప్రకాశించి - కొఴున్దువిట్టు - కొనసాగి - ఓంగియ - వృద్ధిఁబొందిన - ఉన్వళ్ళల్తనత్తినాల్ - ఉన్ - దేవరవారియొక్క - వళ్ళల్తనత్తినాల్ - ఔదార్యము చేత - వల్వినైయేన్ - పాపిష్ఠుఁడైన నాయొక్క - మన - మనస్సున - నీ - నీవు - పుగున్దాయ్ - ప్రవేశించితివి - వెళ్ళైచ్చుడర్ విడుం - వెళ్ళై - పరిశుద్ధమైన - చుడర్విడుం - ప్రకాశించుచున్న - ఉన్పెరు మేన్మైక్కు - ఉన్ - దేవరవారి - పెరు - నిరవధికమైన - మేన్మైక్కు - ప్రభావమునకు - ఇఴుక్కితెన్ఱు - ఇది అపద్యమని - ఇరామానుచా - ఓరా మానుజా - ఎన్ - నాయొక్క - తనినెంచం - తని - తోడులేక ఒంటరియైన - నెంచం - మనస్సు - తళ్ళుత్తిరిరంగుం - తళ్ళుఱ్ఱు - చెలించి - ఇరంగుం - ఈడు పడుచున్నది.

---

ఇరువదియెనిమిదవపాశురంబున ॥ మనఃపూర్వోవాగుత్తర ॥ అనిచెప్పినట్లు ॥ మనస్సునకనంతరమైన వాక్కుయొక్క వ్యాపారమును జెప్పుచు న్నారు.

౨౯ - వ - పాశురము.

మూ ॥ నెంచిఱ్ కఱైకొంటకంచనైక్కాయ్న్ద నిమలనంకళ్
పంచత్తిరువటిప్పిన్నైతన్ కాతలన్ పాతనణ్ణా
వంచర్క్కరియవిరామానుచన్ పుకర్ అన్ఱియెన్వాయ్
కొంచిప్పరవకిల్లాతెన్నవాఴ్ విన్ఱుకూటియతే ॥

టీక ॥ నెంచిఱ్ కఱైకొంట - నెంచిల్ - మనస్సు - కఱై - క్రోపము నుకొంట - కలిగినటువంటి - కంచనై - కంసుని - కాయ్న్ద - నిరశించిన - నిమల - నిర్మలుడైన - నంకళ్ - ఆశ్రితపక్షపాతముగల - పంచత్తిరువటి - పంచదూదివలెమృదువైన - తిరువటి - తిరువటికళుకలిగిన - పిన్నైతన్ - నప్పిన్నై పిరాట్టియందు - కాతల్ - స్నేహముగలకృష్ణునియొక్క - పాతం - శ్రీపాదములనుగూర్చి - నణ్ణావంచర్క్క - నణ్ణా - దండముసమర్పించిన - వంచర్క్క - వంచకులకు - అరియ - దుర్లభమైన - ఇరామానుచన్ - ఈరామానుజుని యొక్క - పుకర్ అన్ఱి - పుకర్ - తిరుక్కల్యాణగుణములు - అన్ఱి - తప్ప - ఎన్వాయ్ - నావాక్కు - కొంచిప్పరవకిల్లాతు - కొంచి - కురుచమాటలచేక్రమముదప్పి - పరవకిల్లాతు - స్తోత్రముచేయనోపదు - ఎన్నవాఴ్వు - ఏమిలాభము - ఇన్ఱు - నేడు - కూటియతే - కూడెను.

---

ఇరువదితొమ్మిదవపాశురంబున రామానుజుని తిరుక్కల్యాణగుణములనుభవించు శ్రీవైష్ణవులనుగని నాకన్నులెప్పుడు సంతోషమునుజెందునోయని చెప్పుచున్నారు.

౩౦ - వ - పాశురము,

మూ॥ కూట్టుంవితియెన్ఱుకూటుంకొలో తెన్కురుకైప్పిరాన్
పాట్టెన్నుంవేతప్పసుంతమిழ్ తన్నై త్తన్పత్తియెన్నుం
వీట్టిన్కణ్వైత్తవిరామానుచన్ పుకర్ మెయ్యుణర్న్తోర్
ఈట్టంకళ్తన్నై యెన్నాట్టంకళ్ కణ్టిన్పమెయ్తిటవే॥

టీక ॥ తెన్కురుకైప్పిరాన్ - తెన్ - దర్శనీయ్యమైన - కురుకైప్పిరాన్ - కురుకై - తిరునగరికి - పిరాన్ - నిర్వాహకుడైన - నమ్మాళ్వారియొక్క

పాట్టెన్నుం-పాటలనెడు - వేతప్పచుఱ తమిళ్ తనై ౨-వేతప్పచుఱ - వేద స్వరూపమై - అర్థబోధకమైన - తమిళ్ తనై ౨ - ద్రావిడమును - తఱపత్తి యెన్నుం - తఱ - తమ - పత్తి - భక్తి - ఎన్నుం - అనెడు - వీట్టిఱకళ్ - ఇంటిలో పలను - వైత్త - ఉంచుకొన్నటువంటి - ఇరామానుచఱ - ఈరామానుజునియొక్క-పుకళ్ - తిరుక్కల్యాణగుణములను - మెయ్యుణర్న్ తోర్ - మెయ్-నిజముగా - ఉణర్న్ తోర్ - ఎఱిఁగినవార్లయొక్క - ఈట్టంకళ్ తనై ౨ సమూహములను - ఎన్నాట్టంకళ్ - నాకన్నులు - కంటు - కని - ఇఱప మెయ్‌తిటవే - ఇఱప - ఆనందమును - మెయ్‌తిటవే - ప్రాపించునట్లు - కూట్టువితి - కూర్చేకృప - ఎన్రుకూటుంకలో-ఎన్రు - ఎన్నఁడు - కూటుంకలో - కూర్చుకొనునో.



ముప్పదవపాశురంబున నిట్లు వీరు ప్రార్థించిన విధివినినవారు - ఇదేనా మీకపేక్ష - మోక్షాదులు వలదాయనిన రామానుజుని కైంకర్యమే చాలును దక్కినదానియందపేక్ష లేదని చెప్పుచున్నారు.

30 - వ - పాశురము.

మూ || ఇఱపఱ తరుపెరు వీటువఱ తెయ్‌తిలేనెణ్ణిఱత
తుఱపఱ తరునిరయుం పలచూళిలెఱ తొల్లులకిల్
మఱపల్లుయిర్ కట్కిఱైయవఱ మాయనెన మొళిఱత
అఱపననకనిరామానుచ నెనై ౨ యాంటననే||

టీక || తొల్లులకిల్ - తొల్ - ప్రవాహరూపమున-అనాదియైన - ఉలకిల్ - లోకమందు - మఱపల్లుయిర్ కట్కుం - మఱ - నిత్యులై - పల్ - అనేకులైన - ఉయిర్ కట్కు - ఆత్మలకు - ఇఱైయవఱ - స్వామియైనవాఁడు - మాయఱ - ఆశ్చర్యగుణచేష్టలుగల సర్వేశ్వరుఁడు - ఎన - అని - మొళిఱత-ఆనతిచ్చిన - అఱపఱ - స్నేహముగల - అనకఱ - దోషరహితుఁడైన - ఇరామానుచఱ - ఈరామానుజుఁడు - ఎనై ౨ - నన్ను - ఆంటననే - ఏలుకొనెను - గాన - ఇఱపఱ తరు - ఇఱపఱ - ఆనందమును - తరు - ఇచ్చునట్టి - పెరువీటు - విలక్షణ

మైన మోక్షమును - పెఱ్ఱు - వఱాతు - వచ్చి - పాయ్దిలేఱ - సిద్ధించు నసునది - ఎణ్ణిఱుఱాత - ఎన్నికలేని - తుఱాపఱాతరు - దుఃఖమునిచ్చునట్టి - నిరయాపల - పల - అనేకములయిన - నిరయం - నరకములు - చూఱ్ఱిలేఱ - చుట్టుకొనిననేను.



ముప్పదియొకటవపాశురంబున - అనాదికాలము - లెక్కలేనిపుట్టుకలవలన తిరిగిన మనము నేడు రామానుజుని జేరగంటిమిగాయని చెప్పుచున్నారు.

౩౧ - వ - పాశురము.

మూ ॥ ఆణ్డుకళ్నాళ్ తింకళాయ్ నికఱ్ కాలమెల్లామనమే
ఈణ్డుపల్ యోనికళ్ తోఱుళఱ్ఱాల్ ఇన్ఱోరెణ్ణిన్ఱియే
కాణ్డకుతోళణ్ణ లెన్ అత్తియూరర్ కళలిణైక్కీళ్
పూణ్డవన్బాళని రామానుచనైప్పొరున్దినమే ॥

టీక ॥ మనమే - ఓమనుసా - నాళ్ తింకళాయ్ - నాళ్ - దినములై - తింకళాయ్ - నెలలై - ఆణ్డుకళ్ - సంవత్సరములై - నికఱ్ కాలమెల్లాం - వర్తమానకాలమంతయు - ఈణ్డు - సమూహములైన - పల్ యోనికళ్ తోఱుం - పల - అనేకములైన - యోనికళ్ - యోనులంతయు - ఉఴల్వోమ్ - తిరుగుచున్నమనము - ఇన్ఱు - నేడు - ఓరెణ్ణిన్ఱియే - ఓర్ - ఒక - ఎణ్ణ - తలంపు - ఇన్ఱియే - లేక - కాణ్డకు - కనతగిన - తోళణ్ణల్ - తోళ్ - భుజములుగల - అణ్ణల్ - స్వామియైన - ఎన్ - దర్శనీయమైన - అత్తియూరర్ - హస్తిగిరినాథుడైన పేరరుళాళరుయొక్క - కళలిణైక్కీళ్ - తిరువడికళయందు - పూణ్డ - కట్టబడిన - అన్బాళన్ - స్నేహముగల - ఇరామానుచన్ - ఈరామానుజులను - పొరున్దినమే - చేరితిమిగా.



ముప్పదిరెండవపాశురంబున రామానుజుని జెరితిమిగదా యని వీరు సంతుష్టులైచేరి చేతనులనుగని - మేము - ఆశ్రయించెదమనిన - ఆత్మగుణములు లేవు

ఏమి చేయుదమనిన - రామానుజుని - ఆశ్రయించిన - అన్నిగుణములుకలుగు ననిచెప్పుచున్నారు.

౩౨ - వ - పాశురము.

మూ ॥ పొరుంతియ తేచుంపొఱైయుంతిఱలుంపుకழுనల్ల
తిరుఙ్తియజ్ఞానముంచెల్వముంచేరుంచెరుకలియాల్
వరుఙ్తియజ్ఞాలత్తైవణ్మయినాల్ వన్దెటుత్తళిత్త
అరుఙ్తవనెంకళిరామానుచనైయడైపవర్క్కే ॥

టీక ॥ చెరుకలియాల్ - చెరు - బాధించిచెరుచునట్టి - కలికాలముచేత - వరుంతియ - బాధలపడుచున్న - జ్ఞాలత్తై - భూమిని - వణ్మయినాల్ - అప్రభాగ్యముచేత - వంతు - వేంచేస్సి - ఎటుత్తు - ఎత్తి - అళిత్త - శిక్షించిన - అరుంతవన్ - అరుదైనతపస్సుగల - ఎంకల్ - మాస్వామియైన - ఇరామానుచనై - ఈరామానుజుని - అడైపవర్క్కు - చేరినవారికి - పొరుంతియ తేచుం - పొరుంతియ - స్వరూపానురూపమైన - తేచుం - ఆధిక్యమును - పొఱైయుం - ఓర్పును - తిఱలుం - బలమును - పుకழுం - కీర్తియు - నల్లతిరుంతియజ్ఞానముం - నల్ల - లెస్సగా - తిరుంతియ - చక్కపెట్టబడిన - జ్ఞానముం - జ్ఞానమును - చెల్వముం - భక్తిరూపసంపదయును - చేరుం - చేరును.



ముప్పదిమూడవ పాశురంబున అస్త్రభూషణాద్యాయుధములయందుమ నస్తత్వాదులను బంచాయుధములు అభిమానదేవతులని చెప్పబడినదిగదా యనిన పంచాయుధములు వీరై యవతరించిరని చెప్పుచున్నారు.

33 - వ - పాశురము.

మూ ॥ అడైయార్కమలత్తలర్ మకళ్ కేళ్ వన్ కైయాழியెన్నుం
పడైయొటునాన్తకముం పటర్తణ్టుమొణ్చార్ఙ్కవిల్లుం
పుడైయార్పురిచంకముమిన్దప్పూతలంకాప్పతఱ్కెన్
ఱిడైయేయిరామానుచమునియాయిన విన్నిలత్తే ॥

టీక ॥ అఙ్గైయాల్ - ఆగులచేత - ఆల్ - పూర్ణమైన - కమలత్తలర్ మకళ్ - కమలత్తలర్ - తామరసపుష్పము - మకళ్ - జన్మస్థానముగాఁగల పెరియపిరాట్టికి - కేళ్వన్ - వల్లభుఁడైన సర్వేశ్వరునియొక్క - కైయిల్ ఆழியొన్నుం పడైయొడు - కై - హస్తమందున్న - ఆழியొన్నుం - తిరువాழியాళ్వానను - పడైయొటు - ఆయుధముతోడ - నాందకముం - నందకమనుపేరుగల ఖడ్గమును - పటర్ తండుం - పటర్ - విస్తారమైన - తండుం - గదయును - ఒణ్ శార్ఙ్గవిల్లుం - ఒణ్ - మంచిదైన - శార్ఙ్గ - శార్ఙ్గమను - విల్లుం - ధనస్సును - పుడైయార్ పురిచంకముం - పుడై - ఉదారమైన - ఆర్ - పూర్తిఁగల - పురి - ప్రదక్షిణమైన - శంకముం - శంఖమును - ఇన్దప్పూతలం - ఇన్ద - ఈ - పూతలం - భూప్రదేశమును - కాప్పతఱ్కు - రక్షించుటకు - ఇన్నిలత్తే - ఈభూమియందే - ఎన్ఱైవమే - ఈసడుమను - ఇరామానుచమునియాయిన - ఇరామానుచముని - ఈరామానుజమునిగా - ఆయిన - అవతరించిరి.



ముప్పదినాలుగవ పాశురంబున నిట్లు - అవతరించి లోకము రక్షించినప్పుడును రామానుజునిగుణములు ప్రకాశించకపోయెను అతఁడునాకర్మమును బాగొట్టినవెనుక గుణములు ప్రకాశించెనని చెప్పుచున్నారు.

౩౮ - వ - పాశురము.

మూ ॥ నిలత్తైచ్చెఱుత్తుణ్ణు నీచక్కలియైనైప్పరియ
పిలత్తైచ్చెఱుత్తుం పిరంక్కియతిల్లైయెన్ పెయ్వినైతెన్
పులత్తిఱ్ పొఱిత్త పప్పత్తకచ్చుమ్మైప్పోరుకిట్టయపిన్
నలత్తైపొఱుత్తతి రామానుచన్ఱయొప్పుకక్షే॥

టీక ॥ ఇరామానుచన్ - రామానుజునియొక్క - నయప్పుకక్షే - నయస్పృహణీయమైన - పుకక్షే - కల్యాణగుణములు - నిలత్తైచ్చెఱుత్తు - నిలత్తై - భూమిని - చెఱుత్తు - హింసించి - ఉణ్ణుం - అదేజీవనముగా జీవించుచున్న - నీచక్కలియై - నీచ - హేయమైన - కలియై - కలికాలముయొక్క -

